కాము, అయితే మరి ఎవ్వరం ?

**మనం ఆర్యులం :-**

మనం ఆర్యులం చరిత్రకారులు చెప్పే ఆర్యులం మాత్రం కాము మనం. మరి చరిత్రకారులు చెప్పే ఆర్యులెవరు ? అనిటే - మొదట మన దేశంలో ద్రావిడులు ఉండే వారని, ఆర్యులు ఎక్కడి నుండో ఉత్తరాన్నుండి - ఈరాన్ దేశం నుండి యిచటికి వచ్చి, ద్రావిడులను పారద్రోలి ఉత్తర భారతము నాక్రమించారని, అప్పటి నుండి ద్రావిడులు దక్షిణ భారతంలో నివాసం ఏర్పాటు చేసికొన్నారని, ఉత్తరభారతంలోని వారు ఆర్యులని, దక్షిణ భారతంలోని వారు ద్రావిడులని, ఆర్యులకు ద్రావిడులకు అప్పు డప్పుడు యుద్ధాలు జరుగుతుండేవని చెబు తుంటారు. పైగా చిత్రమేమంట& ద్రావిడులకు ఆర్యులకు యుద్ధాలు జరిగినట్లు వేదాలలో కూడ ఉన్నదని అంటున్నారు. ఈ Historians (చరిత్రకారులు)లో ఒక్కరూ వేదాలు సరిగా చదివిన వారు లేరు. వాళ్ళయిష్టము వచ్చినట్లు ఏవేవో వ్రాశారు. ఈ వ్రాతలు చదివిన వారు ద్రావిడులు వేరు, ఆర్యులు వేరని, నమ్ము తున్నారు. ఉత్తరాది వాళ్ళు ఆర్యులు కనుక వాళ్ళు మాట్లాడే హిందీభాష మా దాక్షిణాత్యుల (ద్రావిడుల) పైన రుద్దడానికి వీల్లేదని ఆందోళనలు చేస్తున్నారు. దక్షిణాది వారు ! ఆశ్చర్యమే మంటే వేదాలలో సుమారు 20,000 మంత్రాలకు పైగా ఉన్నాయి. ఈ మంత్రాలన్నీ తిరుగవేసినా అసలు ద్రవిడ పదమే అందులో దొరకదు. మరి చరిత్రకారులు - ఆర్యులు, ద్రావిడులు యుద్ధాలు చేసినట్లు వేదాలలో ఉన్నదని వ్రాశారు ! చూడండి వట్టి కల్పనలు చేసి చరిత్ర ఎలా వ్రాశారో ! ఇవి నమ్మి భారతీయులమైన మనం ఆర్య ద్రావిడ భేదాలతో సతమతమవుతున్నాం. ఇవా&'ళ తమిళనాడులో డి.యం.కె (ద్రవిడ మున్నేట్ర కజగం) వారు, మాకు ద్రవిడస్థాన్ వేరే కావాలని, భారదేశం నుండి విడిపోతా?ని అని అంటున్నారు. నేను ఒకమారు మదరాసులో ద్రవిడ కజగం నాయకుడు శ్రీ పి.వి.రామస్వామి నాయకర్‌ను కలుసుకున్నాను. ఆయనతో ఇది చెప్పాను. మీరు ఆర్యులు ద్రావిడులు వేరనుకుంటున్నారు. అది సరికాదు. మనమందరం ఆర్యులమేను, అసలు ద్రవిడ పదమే వేదాలల్లో ఎక్కడాలేదు అన్నాను. ఆయనకు ఆశ్చర్యం వేసింది. అయితే వేదాలల్లో యిది లేదా ? అన్నాడు. లేదన్నాను, ఇలా పెద్ద నాయకులు కూడ ఇంగ్లీషు వాళ్ళు వ్రాసిన చరిత్రలు నమ్మి ఆర్య, ద్రావడ విభేదాలను విడనాడలేక పోతున్నారు. కనుక చరిత్రకారులు చెబుతున్నట్లు ఆర్యులు ఎక్కడి నుండో ఉత్తరాది నుండి వచ్చారని చెప్పేవాదం సరియైంది కాదు. మన దేశంలోనే ఆర్యులు అనాదిగా ఉంటున్నారు. ఇది మన ప్రాచీన గ్రంథాల్లో చదువుతాం. ఆర్యావర్తమని ఈ దేశానికే పేరున్నది. మరి యేదేశానికి లేదు.

మరి మన శాస్త్రాల్లో ఈ దేశానికి పేరేమిటి? చాల పేర్లున్నాయి. జంబూ ద్వీపమని, భరతవర్షమని (భరతుని చేత పాలింపబడింది కనుక) భరతఖండమని, ఆర్యావర్తమని (ఆర్యులుండే దేశం) పేర్లున్నాయి. కాని 'హిందూదేశమని' ఎక్కడా లేదు. ఎప్పుడైనా మీరు సభలో మాట్లాడే ముందు ఏమని సంబోధిస్తారు ? ఆర్యులారా ? అనిటారు. ఓ హిందువులారా అని అంటారా ? అనరు ఈదేశం ఆర్యావర్తం అనడానికి మీకు యింకొక ఉదాహరణ చెబుతాను. సంధ్యావందనం చేసేటప్పుడు బ్రాహ్మణాది వర్ణస్థుల్లో సంకల్పం చెప్పుకొనే అలవాటుంది. ఇది కొన్ని కోట్ల సంవత్సరాలుగా వస్తున్నది. ఆసంకల్పంలో ఏం చెబుతాం ? 'జంబూ ద్వీపే భరతవర్షే భరతఖండే మేరోరక్షిణ దిగ్భాగే' "ఆర్యావర్తే" పుణ్యభూమౌ కృష్ణా కావేర్యోర్మధ్య దేశే అంటూ తన ఊరి పేరు తన పేరు తిథి వార మాసములతో సహా సంకల్పం చెప్పు కుంటుంటారు. అందులో "ఆర్యావర్తే పుణ్య భూమౌ" (ఆర్యులు వర్తించిన పుణ్యభూమి) అని కూడ కీర్తిస్తారు. కనుక మనం ఆర్యులం అందుకనే కృష్ణుడు కూడ 'అనార్యజుష్టం' - అర్జునా ! నీవీ ఆర్యులకు తగనిపని చేస్తున్నావు అంటాడు గీతలో. అందుచేత మనం హిందువులం కాము, ఆర్యులమనేది శాస్త్రసమ్మతం.

కాని పావం హిందు పదం వదిలి పెట్టడానికి యిష్టం లేక కొందరు దానికి ఏదేదో వ్యుత్పత్తి అర్థం చెప్పి సమర్థించాలని చూస్తుంటారు. 'హీనం దునో తీతి హిందుః' - హీనుణ్ణి దండించేవాడు. కనుక హిందువు' అని చెప్పి సమర్థిస్తుంటారు. అయితే మనం హీనుల్ని - చేత కాని వాళ్ళను దండించే వాళ్ళమే కాని బలవంతుల్ని ఏమీ చేయలేమన్న మాట (సభలో నవ్వులు) ఇలా సమర్థించడంలో అర్థం లేదు. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాజ్యాంగంలో మనది. భారతదేశమనే నిర్ణయించడినది. హిందూదేశమని కాదు. కనుక మనం అందరం భారతీయులం. ఈ దేశంలో ఉండే క్రైస్తవులు, మహమ్మదీయులు అందరూ భారతీయులే. ఇప్పుడు క్రైస్తవులయిన వారు కూడ ఒకప్పుడు హిందువులే. క్రైస్తవులయిన తరువాత వారిపుడు మనల్ని 'అన్యులు' అంటున్నారు. మనం అన్యులమట ! క్రైస్తవులు మతప్రచారం చేస్తూ మిమ్ములను (దీర్ఘం తీసి పలుకుతూ శ్రీగురుదేవులు) "ఓ పాపులారా" అని సంబోధిస్తారు (సభలో నవ్వులు) వారి దేవుడు పుట్టించిన ఆదం, అవ్వపాపం చేశారట, వారి సంతతి కనుక వారంతా పాపులవుతారు కాని, మీరు పాపులు ఎలా అవుతారు ? వాళ్ళు మిమ్మల్ని ఓ పాపులారా ! అంటుంటే, అదేదో వాళ్ళు మిమ్మల్ని భూషిస్తున్నట్లు విని ఊరుకుంటారు ! ఇంగ్లీషురాని వాణ్ణి, ఇంగ్లీషు వచ్చినవాడు 'రాస్కెల్' (Rascal-పాపి, అయోగ్యుడు) అంటే ఓహో, యిదేదో తనను నుంచి వాడంటున్నాడు కాబోలు అనుకుంటాడు (సభలో నవ్వులు) కనుక క్రైస్తవులు మిమ్మల్ని పాపులని సంబోధిస్తే. అది విని మీరు ఊరుకోకూడదు, వాళ్ళకు గట్టిగా చెప్పాలి, మీరు పాపులు అయితే కావచ్చును గాని మేం పాపులం కాదని.

మనం ఆర్యులం అనడానికి మీకు యింకొకటి చెబుతాను. మనకు తెలుగులో 'పోతనార్య' 'తిక్కనార్య' అనే పేర్లున్నాయి. ఆ ఆర్యపదమే తెలుగులో 'అయ్య' అయింది. వెంకయ్య, పుల్లయ్య, సుబ్బయ్య పేర్లు అలా వచ్చినవే. కనుక మనం ఆర్యులం అనడంలో సందేహం లేదు.

అయితే ఆర్య పదం అంగీకరించడం యిష్టం లేక హిందుపదాన్ని సమర్థించే వారిలో శ్రీ ఉమామహేశ్వర పండితుని లాంటి వారు పురాణాలలోని శ్లోకాలు తీసికొని ఉపన్యసిస్తూ యివి వేదంలో ఉన్నాయి అని చెబుతారు. M.A. (Master of Arts) B.A. (Bachelor of Arts) ల వలె 'హిం కృణ్వంతి' అనే వాక్యం నుండి. 'హిం దునోతి' అనే పదం నుండి'దు' తీసికొని 'హిందు' పదం ఏర్పడింది. అని చెబుతుంటారు. అలాగైతే

# సిపాయిలకు సంకెళ్ళు

- ఎం.వి.ఆర్. శాస్త్రి

అశుద్ధపు తూటాలు కొరకబోమన్న 'నేరానికి' కోర్ట్ మార్షల్ చేసి బరంపురం నుంచి తరలించిన 19వ పటాలం 1857 మార్చి 31 ఉదయం కాళ్లీడ్చుకుంటూ బారక్‌పూర్ చేరింది. శిక్ష ఏమిటో సరిగా తెలియదు గాని మొత్తానికి తమ కొలువుకు మూడిందన్న సంగతి సిపాయిలు ఎరుగుదురు. మామూలుగానే తమను పురుగుల్లా చూస్తూ, తమ మతాన్ని, తమ విశ్వాసాలను, తమ దేవతలను అకారణంగా దూషిస్తాండే తెల్లదొరలు మతాచారాల కారణంతో తాము తిరగబడటాన్ని తీవ్రంగా పరిగణించి కర్కశంగా కాలరాచివేస్తారనడంలో వారికి సందేహం ఎంత మాత్రం లేదు.

పటాలంలో ఒకరూ ఇద్దరు కాదు ఏకంగా వెయ్యిమంది సిపాయిలున్నారు. అందరి చేతిలోనూ ఆయుధాలున్నాయి. వారి చుట్టూ గొప్ప సైనిక కాపలా ఏమీ లేదు. తలచుకుంటే బారక్‌పూర్ చేరకుండా మధ్యదారిలోనే అంతా కలిసి పై అధికారులపై తిరగబడి కట్టకట్టుకుని పారిపోగలిగేవారే. విశృంఖల విధ్వంసం చేయగలిగేవారే. కాని సిపాయిలకు అటువంటి ఆలోచనే రాలేదు. మతాన్ని మంట గలిపిస్తున్నారన్న కడుపు మంటతో క్షణికావేశంలో ఎదురుతిరిగినా, దుర్నిరీక్ష్యమైన బ్రిటిష్ సైనిక శక్తిని ఎదిరించి నిలవగలమన్న ధైర్యం వారికి లేదు. దేవుడి మీద భారం వేసి, బితుకు బితుకుమంటూ వారు పిల్లుల్లా గమ్యం చేరారు.

అంతకుముందు రోజే ప్రత్యేకంగా పిలిపించిన సీమ రాణివారి 84వ రెజిమెంటు, రెండు బ్యాటరీల యూరోపియన్ శతఘ్ని దళం బారక్‌పూర్ చేరుకున్నాయి. ఆ సీమ సేనల గట్టి బందోబస్తు మధ్య, ఇంగ్లీషు శతఘ్నులు ఏ క్షణమైనా పేలడానికి నోళ్లు తెరుచుకుని ఉండగా, నేటివ్ బ్రిగేడ్ సైనికులందరూ నివ్వెరపోయి చూస్తుండగా 19వ పటాలాన్ని బారులు తీర్చి నిలబెట్టి గవర్నర్ జనరల్ వారి ఉత్తర్వును చదివి వినిపించారు. తూటాల గురించి వారి భయాలన్నీ వట్టి భ్రమలనీ, అకారణంగా రెచ్చిపోయి క్షమించరాని అవిధేయతకు పాల్పడినందుకు మొత్తం పటాలాన్నీ రద్దుచేస్తున్నామనీ ఎలుగెత్తి చాటారు. తర్వాత సిపాయిలందర్నీ ఆయుధాలు ఒకచోట పడెయ్యమన్నారు. బెల్టులు తీసి బాయినెట్ల మీద ఉంచమన్నారు. యూనిఫాంలను మాత్రం దయతలిచి ఉంచుకోనిచ్చారు. మిమ్మల్ని సేన నుంచి గెంటేస్తున్నాం, నెత్తిన చెంగేసుకుని మీ ఇళ్లకు పొండి అన్నారు. సిపాయిలు కిక్కురుమనకుండా గుడ్ల నీళ్లు కక్కుకుంటూ ఆజ్ఞలు పాటించారు. కంటి చూపుతోనే సహచరుల నుంచి సెలవు తీసుకుని దీనంగా, భారంగా అడుగులేస్తూ ఇంటిదారి పట్టారు.

దొరలది దొడ్డ మనసు. గెంటేసిన సిపాయిలకు ప్రయాణం ఖర్చుకింద కాస్త మొత్తం చేతిలో పెట్టారు. ఆ ఔదార్యానికి మురిసి ముప్పందుమై మిగతా సిపాయిలు తన ఘనతను మిక్కిలి కొనియాడుతారని వారు ఊహించారు. కాని - చూస్తున్న సిపాయిలకు మాత్రం దొరవార్ల తీరులో ఔదార్యంకంటే దౌర్జన్యమే ఎక్కువగా కనిపించింది. మా మతాచారానికి విరుద్ధం, చండాలపు తూటాలను కొరకమనకండి మహాప్రభో అని మొత్తుకున్నా వినకుండా, ఆక్రోశాన్ని వెలిగక్కిన అపరాధానికే ఉద్యోగాలు ఊడగొట్టి, తుపాకులు లాక్కుని తమ సోదరులను వెళ్లగొట్టారే ! తమదీ అదే సమస్య కదా ? ఆత్మను చంపుకోలేకపోతే రేపు తమ గతీ అంతే కదా - అని వారికి నిర్వేదం కలిగింది. ఎదురుతిరిగితే ఇదిగో ఇలా బర్తరఫ్ చేస్తామని ప్రత్యక్షంగా చూపిస్తే మిగతా సిపాయిలు భయపడి, తల ఎగరేయకుండా బుద్ధిగా పడి ఉంటారని దొరలు అనుకున్నారు. కాని - ఆచారానికి కట్టుబడి, కొలువుకంటే కట్టుబాటుకు విలువిచ్చి, ధైర్యంగా ఎదురుతిరిగి, హుందాగా శిక్షను స్వీకరించిన సోదరులను చూస్తే మిగతా వారికి భయం కాదు - భక్తే కలిగింది. వారి లోలోన రగులుతున్న ధర్మాగ్రహం ఇంకా ప్రజ్వరిల్లింది.

19వ పటాలాన్ని సాగనంపి నెల తిరిగిందో లేదో 34వ పటాలం వంతు వచ్చింది. మంగళ్‌పాండే ఎదురుతిరిగి కాల్పులతో బీభత్సం సాగించినప్పుడు పై వారెవరు ఆజ్ఞాపించినా, అతణ్ని అదుపు చేయటానికి అతడి పటాలంలో ఎవరూ ఇచ్చగించలేదన్న కచ్చితో కంపెనీవారు ఆగ్రహించారు. యథావిధిగా మొక్కుబడి విచారణ అనంతరం గవర్నర్ జనరల్ కానింగ్ ప్రభువు 34వ రెజిమెంటును కూడా రద్దుపరుస్తూ ఉత్తర్వు చేశారు. మళ్లీ అదే సీను. అదే తతంగం. యూరోపియన్ దళాల గట్టి సహరా మధ్య 84వ రెజిమెంటుకు చెంది ఆ సమయాన అక్కడ ఉన్న 500 మంది సిపాయిలనూ సమావేశపరిచి, ఉత్తర్వు వినిపించి, వెళ్లగొట్టారు. ఈసారి వంటి మీద యూనిఫాంలు కూడా ఉండనివ్వకుండా విప్పించి లాగేసుకున్నారు. ఆఖరికి ప్రయాణం ఖర్చుకు కూడా పైకం ఇవ్వలేదు. మీ తిప్పలు మీరు పడండి పొమ్మన్నారు. అది చూసిన మిగతా సిపాయిలకు కడుపు మండింది. వారి లోపలి క్రోధం మరింత పెరిగింది.

అవిధేయతను ఎక్కడికక్కడ అణచివేస్తే ఇకపై ధిక్కారానికి ఎవరూ సాహసించరనీ, అంతటితో అలజడి సమసిపోతుందనీ 'జాన్ కంపెనీ' జానీలైతే అనుకున్నారు. కానీ కథ అక్కడితో అయిపోలేదు. అసలు కథ అప్పుడే మొదలైంది. కొలువునుంచి తొలగించిన 19వ పటాలం వారు వెయ్యి మంది; 34వ పటాలం సిపాయిలు 500 మంది - వెరశి 1500 మంది స్వస్థలాలకు వెళ్లి దొరలు చేసిన అన్యాయాన్ని, దేశీయులను మతభ్రష్టుల్ని చేయటానికి వారు ఒడిగట్టిన అఘాయిత్యాన్ని, తద్వారా ముంచుకొస్తున్న ముప్పును వేనోళ్ల వ్యాప్తి చేశారు. ఆ వైనాలు ఆనోట ఈనోట పడి దేశమంతటా వ్యాపించాయి. ఆవు, పందుల ఎముకల పొడిని పిండిలో కలిపి అందరిచేతా తినిపించనున్నారని పుకార్లు పుట్టాయి. మతావేశం పెరిగి దేశమంతా అట్టుడికిపోయింది.

నాటి బెంగాలు సైన్యంలో అత్యధిక సంఖ్యాకులు అవధ్ ప్రాంతానికి చెందినవారు. బర్తరఫ్ అయిన రెండు పటాలాల్లో దాదాపు అందరూ ఆ ప్రాంతంవారే. వెనక్కి వచ్చి వారు మోసుకొచ్చిన దుర్వార్తలను విని అక్కడి జనం నిశ్చేష్టులయ్యారు. స్థానికంగా ఉన్న పటాలాల మీద వారి సంపర్క ప్రభావం సహజంగానే పడింది. ముఖ్యంగా మీరట్ కంటోన్మెంటులో బారక్‌పూర్ నుంచి బర్తరఫయిన సిపాయిలు రావడానికి ముందే అక్కడ పరిస్థితి ఉద్రిక్తంగా ఉంది. ఢిల్లీకి సుమారు 40 మైళ్ల దూరంలోని

మీరట్ బ్రిటిష్ వారికి దేశంలో గల పెద్ద సైనిక స్థావరాల్లో ఒకటి. నేటివులతో కూడిన పదాతి దళం రెజిమెంట్లు రెండు, అశ్విక దళం రెజిమెంటు ఒకటి ఉన్నాయక్కడ. అవిగాక పూర్తిగా బ్రిటిష్ వారితో నిండిన రెజిమెంట్లూ, రైఫిల్స్ బెటాలియన్లూ, ఆశ్విక బలగాలూ దండిగా ఉండటంతో ఎటువంటి తిరుగు బాటునైనా అవలీలగా అణచివేయగలమన్న ధీమా తెల్లదొరలకు జాస్తి. అందునా అక్కడి 3వ నేటివ్ కావల్రీ (ఆశ్విక దళం) కమాండరయిన కర్నల్ స్మిత్‌కు మహా గీర. భారతీయులన్నా వారి సెంటిమెంట్లన్నా అతడికి చాలా చులకన.

కొత్తగా వచ్చిన తూటాలను ఎలా వాడాలో నేర్పటంకోసం ఏప్రిల్ 24న పెరేడ్ పెట్టదలిచి, వివిధ దళాలకు చెందిన 90 మంది రౌతులను దానికోసం ఎన్నిక చేశాడు. కొత్త తూటాలు మలినమైనవన్న సంగతి కర్ణాకర్ణిగా అప్పటికే అందరికీ తెలిసింది కనక వాటిని తాకటానికి ఆశ్వికులు నిరాకరించారు. ఏప్రిల్ 24 పెరేడ్‌లో ఐదుగురు తప్ప అందరూ తూటాలను తీసుకోమన్నారు. తీసుకోక తప్పదని కర్నల్ స్మిత్ ఎంత నిర్బంధించినా ప్రయోజనం లేకపోయింది. దొర ఆజ్ఞకు బెదిరి మతభ్రష్టులు కావటానికి ఎవరూ సిద్ధపడలేదు. పెరేడ్ భగ్నమైంది. దొరలు అగ్గిరాములయ్యారు. రివాజు ప్రకారం కోర్ట్ ఆఫ్ ఎంక్వయిరీని, ఆ తరువాత కోర్ట్ మార్షల్‌ని జరిపించారు. నేటివ్‌లపై కోర్టు మార్షలును నేటివ్‌ల చేతే జరిపించటం తమ ధర్మబుద్ధికి నిదర్శనమని తెల్లవారు గొప్పగా చెపుతారు. మార్షల్ కోర్టు పీటల మీద కూచునేది జన్మతః భారతీయులే అయినా పైనున్న దొరల ఇంగితమెరిగి మెలగాల్సిందే తప్ప స్వతంత్రంగా వ్యవహరించి సోదర సైనికులకు న్యాయం చేసే సావకాశం వారికి సున్న. అక్కడికీ ఒకడు ధైర్యంచేసి విభేదించినా, మిగతా 14 మంది పై వారి ఒత్తిడికి తందాన అనటంతో షరా మామూలుగా నేర నిర్ధారణ అయిపోయింది.

బరంపురంలో తిరగబడ్డ 19వ పటాలాన్ని బర్తరఫ్ చేసినా యూనిఫాంను ఉంచు కోనిచ్చారు. బారక్‌పూరలో సహాయ నిరాకరణ చేసిన 34వ పటాలానికి యూనిఫాంను లాగేసినా వెళ్లగొట్టారే తప్ప ఖైదు చేయలేదు. ఈ రెండు పటాలాలతో పోల్చితే మీరట్ దండు అపరాధం చిన్నదే అయినా వాటికంటే కూడా ఎన్నోరెట్లు కఠినమైన శిక్షను మీరట్ వారికి విధించారు. కలుషితమైన తూటాలు నోట పెట్టుకోవటమే మహా నేరంగా ఎంచి, వారి ప్రార్థనలనూ, నబబైన అభ్యంతరాలనూ పెడచెవిన పెట్టి, వట్టి భర్తరఫ్ చాలదని తలచి, నిందితులు మొత్తం 85 మందికీ పదేళ్ల కఠిన కారాగార శిక్షను విధించారు. ఆ సంగతి తెలిసిన సిపాయిలు యావన్మందీ అవాక్కయ్యారు.

శిక్షే క్రూరమైనదనుకుంటే దానిని అమలుపరచిన తీరు క్రూరాతి క్రూరమైనది.

అది 1857 మే 9. సిపాయిల మనసుల్లో లాగే ఆకాశంలోనూ మబ్బులు కమ్మాయి. ఉదయమే మొత్తం బ్రిగేడ్ అంతటిని పెరేడ్ గ్రవుండుకు పిలిచారు. ఎవరూ తోక జాడించటానికి వీల్లేకుండా యూరోపియన్ బలగాలనూ, ఆశ్విక దళాలనూ, ఫిరంగుల దండునూ చుట్టూ కాపలా పెట్టారు. అప్పుడు ఏమి జరిగిందీ విఖ్యాత ఆంగ్ల చరిత్రకారుడు ***Sir John Kaye*** మాటల్లో చదవండి :

*"Under a guard of Rifles and Carabineers, the Eighty-five were then brought forward, clad in their regimental uniforms - soldiers still; and then the sentence was read alud, which was to convert soldiers into felons. Their accoutrements were taken from them, and their uniforms were stipped from their backs. Then the armourers and the smiths came forward with their shackles and their tools, and soon in the presence of that great concourse of their old comrades, the Eighty-five stood, with the outward symbols of their dire disgrace fasttened upon them... Lifting up their hands and lifting up their voices, the prisoners implored the General to have mercy upon them... There was not a Sepoy present who did not feel the rising indignation indignation in his throat."*

[***A History of the Sepoy Was in India, John Koye,*** Vol.II P.51]

*(రైఫిళ్లు, పొట్టి తుపాకుల దళాలు కాపుకాస్తుండగా ఎనభై ఐదుగురినీ ముందుకు తెచ్చారు. అప్పటికి వారు ఇంకా సోల్జర్లే. రెజిమెంటు యూనిఫాం వేసుకుని ఉన్నారు. వారికి విధించిన శిక్షను అప్పుడు బిగ్గరగా చదివి వారికి వినిపించారు. సైనికులు కాస్తా నేరస్థులు అయిపోయారు. వారినుంచి సైనిక చిహ్నాలు లాగేశారు. వొంటి మీది యూనిఫాంలను విప్పించారు. బేడీలను, కొక్కేలను, పనిముట్లను పట్టుకుని కమ్మరి పనివాళ్లు వచ్చారు. సహచరుల మహా సమూహం సమక్షంలో తమ కాళ్లకూ చేతులకూ అవమాన చిహ్నాల బంధనాలు పడుతూండగా చేతులెత్తి ఆ ఎనభై ఐదుగురూ గొంతెత్తి దయ చూపమంటూ జనరల్‌ను కడుదీనంగా వేడుకున్నారు... అప్పుడక్కడ ఉన్నవారిలో గొంతు నిండా క్రోధం రగలని సిపాయి ఒక్కడూ లేడు.)*

"కమ్మరి వాళ్లు తమ పని తాపీగా కానిచ్చారు. అంతమంది కాళ్లకు చేతులకు సంకెళ్లు దిగవేయడానికి చాలా సమయం పట్టింది. ఎన్నో యుద్ధాల్లో ప్రాణాలొడ్డి తెల్లదొరలకు అఖండ విజయాలను చేకూర్చి పెట్టి, అందుకు గుర్తింపుగా ప్రతిష్ఠాత్మకమైన ఎన్నో పతకాలను పొంది, నిన్నటిదాకా రొమ్ము విరుచుకు తిరిగిన యోధులు, వాటన్నిటినీ తమ వొంటినుంచి వొలిచేసి, యూనిఫాంను కూడా ఊడబెరికి సంకెళ్లు వేస్తుంటే వలవల ఏడ్చారు. వారిని చూసి యువ సిపాయిలూ దుఃఖం ఆపుకోలేకపోయారు. నా జీవితంలో అంతటి హృదయ విదారక దృశ్యం మరొకటి చూడలేదు" అంటాడు. ***'Old Memories'*** **గ్రంథంలో ప్రత్యక్ష సాక్షి.**

సంకెళ్లు పడ్డ ఖైదీలను బందిఖానాకు తరలించి చీకటి కొట్లలో పెట్టారు. బరువెక్కిన గుండెలతో సిపాయిలు తిరిగొచ్చారు. తమ తోటివారికి పట్టిన గతి చూశాక ఇక సిపాయిలెవరూ తల ఎగరవేయలేరనీ, మతమూ ఆచారమూ అని గింజుకోకుండా దేన్ని కొరకమంటే దానిని కిమ్మనక కొరికి, తమ కాళ్ల దగ్గర చచ్చినట్టు పడి ఉంటారని కర్నల్ స్మిత్తూ, ఇతర దొరలూ ధీమాగా ఉండి తమ చురుకుతనాన్ని కరకుతనాన్ని తామే తెగ మెచ్చేసుకున్నారు. బారక్‌పూర్ సెగలు మీరట్‌కు పాకి, సైనికుల లోపల మరుగుతున్న లావా పెల్లుబికి 24 గంటల లోపలే అగ్నిపర్వతం బద్దలవబోతున్నదన్న సంగతి వారికి తెలియదు. తాము చూస్తున్నది తుఫానుకు ముందుండే స్తబ్ధత అని వారు గ్రహించలేదు. పెద్దఎత్తున తిరుగుబాటుకు కుట్ర ఏదో జరుగుతున్నదట అని ఒక యూరోపియన్ ఆఫీసరు ఉప్పందిస్తే 'పనికిమాలిన కబుర్లు పట్టించుకోకుణ అని కర్నల్ స్మిత్ చిరాకు పడ్డాడు కూడా.

బారక్స్‌కు తిరిగొచ్చిన సిపాయిలెవరికీ అన్నం సయించలేదు. కాళ్లూ చేతులకు సంకెళ్లతో వెళుతూ వెళుతూ ఖైదీలు తమకేసి దీనంగా చూసిన చూపే కళ్లు మూసినా తెరిచినా

వారికి గుర్తుకు రాసాగింది. మాకింత అన్యాయం జరుగుతూంటే గుడ్లప్పగించి చూస్తారేమర్రా అని తమను ఉద్దేశించి వారు వేసిన కేకలు వారి చెవుల్లో అనుక్షణం మారుమోగసాగాయి. తమ సహచరులు ఏ తప్పూ చేయలేదు. తాము అందరూ చాలారోజులుగా మథనపడుతున్నదే వారిని కూడా బాధించింది. తాము చేయాలను కుంటున్నదే వారు ధైర్యంగా చేశారు. ధర్మానికి, ఆచారానికి, సంప్రదాయానికి భంగం కలిగించడానికి ససేమిరా సమ్మతించక నిర్భయంగా ప్రతిఘటించి తమందరికీ వారు ఆరాధ్యులూ, మార్గదర్శకులూ అయ్యారు. విశ్వాసంకోసం బలిదానానికి సిద్ధపడ్డ వారిని అలా వదిలేయటం అమానుషం. మనకెందుకు లెమ్మని ఊరుకుంటే ఇవాళ వారికి పట్టిన గతే రేపు అందరికీ పడుతుంది. ఎద్దుల ఎముకలు పొడిచేసి కలిపిన పిండితో రొట్టెలను చేసుకు తింటూ, ఆవు కొవ్వునూ, పంది కొవ్వునూ నోట కరుస్తూ కులం నుంచి వెలివేయబడి, సర్వభ్రష్టులై హీనాతిహీనంగా, హేయాతి హేయంగా తమను తామే అసహ్యించుకుంటూ నికృష్టపు బతుకు బతకాల్సి వస్తుంది. అంతకంటే చావటం మేలు. దౌర్జన్యానికి, పశుబలానికి తలవంచి అవమానాలతో చస్తూ బతికే కంటే ధైర్యంగా తిరగబడి, తమను ఇంతటి రంపపు కోతకు గురిచేసిన విదేశీ రాకాసులపై కలిసికట్టుగా పోరాడి చావటం మేలు.

ఈ రకమైన భావావేశంతో యువ సిపాయిలు లోలోన దహించుకుపోతుండగా నిప్పుకు గాలి తోడైనట్టు ఎక్కడికి పోయినా ఎవరిని కలిసినా వారిని సాధారణ పౌరులు, సామాన్య గృహిణులు మాటల ఈటెలతో పొడవసాగారు. ఆఖరికి మీరట్‌లోని పడుపుగత్తెలు కూడా మీ వాళ్లని అలా ఖైదు చేస్తే మిన్నకున్నారేమి, మీకు మగతనం లేదా అని సిపాయిలను ఉడికించారు. ఆ రాత్రి ఎవరూ నిద్రపోలేదు. ఏమి చేయాలి, ఎలా చేయాలి అని సిపాయిలు గుంపులు గుంపులుగా గుసగుసలాడుకున్నారు. ఎలా కదలాలి, కదిలి ఏమి చేయాలని తలపోస్తూ ఉద్వేగంతో, ఆందోళనతో పరిపరి విధాల యోచిస్తుండగా తెల్లవారింది. భయానక బీభత్సానికి, భీషణ సంగ్రామానికి, చరిత్రను మలుపు తిప్పే మహా విప్లవానికి తెర తొలగింది.

అది చరిత్రలో మరపురాని రోజు.

1857 మే 10.

M.A; అన్నప్పుడు 'M' కు 'A' కు మధ్యలో చుక్క పెడుతున్నాం కదా ? అలాగే హిందు పదంలో 'హిం' కు 'దు' కు మధ్యలో చుక్కపెట్టి వ్రాయాలి. కాని మనం అలా వ్రాయడం లేదు. కారణమేమి ? అందుచేత అది రెండు పదముల సంగ్రహ పదం కాదని తేలుతుంది.

**ఆర్య సమాజకులవడం అంత సులభం కాదు:-**

అసలు ఈ హిందుపదాన్ని సమర్థించే వాళ్ళకొక భయం ఉంది. మనం ఆర్యులం అని అంగీకరిస్తే ఆర్య సమాజకులమయి పోతా మేమోనని. ఆర్య సమాజకులవడం అంత సులభ మేం కాదు. మొదట ఆర్యులు (శ్రేష్ఠులు) కావాలి. తరువాత ఆర్య సమాజకులవుతారు. వేదాలు, తదితర వైదిక సాహిత్యం చదివి దాన్ని ప్రచారంలో పెట్టాలి. అప్పుడతడు ఆర్య సమాజకుడౌతాడు. ఆర్య సమాజకులు సత్యాన్ని బయటపెట్టి సంఘంలో ఉండే దురాచారాలను ఖండిస్తుంటారు. అందుచేత ఈపౌరాణికులకు, ఎక్కడ వాళ్ళ మోసాలు బయటపడతాయోనని పాపం భయం. కనుక ఆర్యసమాజం వాళ్ళన్నా, ఆర్యపదమన్నా వాళ్ళకు యిష్టం ఉండదు.

**మదనమోహన మాలవ్యా 'హిందు' పద నిర్వచనం చేయడంలో ఒక నిర్ణయానికి రాలేక పోయాడు :-**

నేను కాశిలో ఉన్న రోజుల్లో శ్రీ పండిత మదనమోహన మాలవ్యా హిందుపదాన్ని నిర్వచించడానికి ప్రయత్నించాడు. దేవుడున్నాడనే వారు హిందువులు అందామా అంటే, హిందువులలో దేవుడు లేడనే నాస్తికులు కూడ ఉన్నారు. యజ్ఞోపవీతం వేసికున్న వాళ్ళు హిందువులందామా అంటే, యజ్ఞోపవీతం లేనివాళ్ళు చాలమంది వారిలో ఉన్నారు. పోనీ అడ్డబొట్టు పెట్టుకొనే వాళ్ళు హిందువులను కుందామంటే నిలువుబొట్టు పెట్టిన వాళ్ళూ హిందువుల్లో ఉన్నారు. (సభలో నవ్వులు) నెత్తి మీద జుట్టున్న వాళ్ళు హిందువులంటే, జుట్టు లేనివాళ్ళు కూడ ఉన్నారు. ఇలా ఆయన 'హిందు' పద నిర్వచనం చెయయడంలో ఒక నిర్ణయానికి రాలేకపోయాడు.

**ఆర్యశబ్దం చాల ఉత్తమమైనది :-**

అందుచేత హిందువులనడంలో ఏం విశేషముంది ? కావున మనం ఆర్యులమే కాని హిందువులం కాదు. అది అర్థవంతమైన పదం. ఆర్యుడంటే ప్రగతి శీలుడని అర్థం. మన పూర్వులు ఆర్యులై యితరులను ప్రగతిపథమున నడిపిన వారు. ఇవ్వాళ ప్రపంచం ప్రగతి పథంలో నడుస్తున్నది. మన మంతా కూడ దేశపు ప్రగతి కోసం పాటుపడుతున్నాం. వేదాలలో మనకు వాడిన శబ్దం ఆర్యశబ్దమే. **'విజానీః ఆర్యాన్ యేచ దస్యవః' - ఆర్యులు,** దస్యులు అని యిరు తెగలవారు మనుష్యులలో ఉంటారని వేదం చెబుతుంది. వారిలో ఆర్యులంటే - నియమ బద్ధంగా జీవితం గడిపి సంఘశాంతికి తోడ్పడే వారని అర్థం. దస్యులు అంటే సంఘానికి హాని కలిగించేవారని అర్థం. **'దసుఉపక్షయే'** - అనే ధాతువుతో దస్యశబ్దం ఏర్పడుతుంది. 'ఆర్యుడంటే ఎవరు'? 'ఆర్యః కస్మాత్' అని ప్రశ్న వేసికొని యాస్కా చార్యుడు తన 'నిరుక్తం' (వైదిక నిఘంటువు)లో **'ఆర్యః ఈశ్వరపుత్రః'** - భగవంతుని తండ్రిగా అంగీ కరించేవాడు ఆర్యుడన్నాడు. ఎంత చక్కగా చెప్పాడో చూడండి. మనమందరం భగవంతుని తండ్రిగా అంగీకరిస్తాం. కనుక మనం ఆర్యులమని చెప్పుకోవడానికి సందేహించ నక్కరలేదు. **ఆర్యశబ్దం 'ఋగతౌ' అనే ధాతువుతో** ఏర్పడింది. గతి అనగా గమనం, జ్ఞానం, ప్రాప్తి అని అర్థాలున్నాయి. అంటే ఆర్యుడు ప్రగతి శీలుడు శ్రేష్ఠుడు అని అర్థం. జ్ఞానం కొఱకు, లేని దాని కొఱకు యత్నించువాడు. **కర్తవ్యమాచరన్ కర్మ అకర్త వ్యమనా చరన్, తిష్ఠతి ప్రకృతా చారే సవై ఆర్య ఇతీ రితః** - కర్తవ్య కర్మలు వేద విహిత కర్మలు - ఆచరించే వాడు, విరుద్ధమైన కర్మలు ఆచరింపని వాడు, ఆర్యుడనబడతాడు. ఇలా ఆర్య శబ్దానికి మంచి అర్థాలున్నాయి. అద్వైత మత స్థాపకుడైన శంకరుడు, విశిష్టాద్వైత మతమును స్థాపించిన రామానుజుడు, ద్వైతమతాన్ని స్థాపించిన మధ్వుడు వీరందరూ కూడ, ఆర్యపదాన్ని అంగీకరించుతున్నప్పుడు మనం ఆర్యులమని చెప్పుకోడానికి ఎందుకంగీ కరించరు ?

కృష్ణుడు, అర్జునుణ్ణి సంబోధిస్తూ 'అనార్యజుష్టం' - అర్జునా ! ఆర్యులకు తగని ఈ మనోమాలిన్యం నీకెక్కడి నుండి వచ్చింది అంటాడు. అందుచేత, ఆర్యశబ్దాన్ని వితీవరిస్తూ మీకి దంతా చెప్పవలసి వచ్చింది. మిగిలింది రేపు చెప్పుకుందాం.

आर्य प्रतिनिधि सभा, आ.प्र.-तेलंगना, सुल्तान बाजार,

# बिक्री विभाग

1. గీతామృతము
2. వైదిక ధర్మోపదేశములు (ద్వితీయ భాగం)
3. వైదిక భజనామృతము (సప్రమాణ విభూషితము)
4. ఆర్య సమాజమునగా నేమి ?
5. ఓంకార ధ్వనులు
6. వైదిక దర్మోపదేశములు (తృతీయ భాగం) (ప్రథమ భాగం)
7. సంస్కార విధి
8. ఆరోగ్యమే మహాభాగ్యము
9. వైదిక సంధ్యా వందన రహస్యము
10. ఆర్యపుత్ర శతకము
11. సత్సంగ మహిమ
12. మేధస్సు జ్ఞానములను పెంపొందదించుకోవడం మెలా ?
13. గురు విరజానందుడు- ఋషి దయానందుడు
13. ధార్మిక లఘు గ్రంథావళి
14. 'కండ్లజోడు లేకుండ బాగా చూడడం ఎలా
15. ఆర్య సమాజకులు వేద దర్మ ప్రచారం ఎలా చేస్తె బాగుంటుంది ?
16. ఋషిదయానంద వచనామృతము మహర్షి దయానంద వాణి
17. ఆస్తిక్యము × నాస్తిక్యము
18. మన జీవన లక్ష్యం
19. మన జీవన లక్ష్యం
20. యోగమంటే ఏమిటి ?
21. నూరేండ్ల వరకూ ఆరోగ్యంగా ఉండడం మెలా ?
22. శరీర దృఢత్వానికి, సంపూర్ణ ఆరోగ్యానికి, దీర్ఘ యువవుకు సాధారణ వ్యాయామాలు.
23. సత్యజ్ఞానం పొందడం మెలా ?
24. సత్సంగ మహిమ
25. మహర్షి దయానంద లేఖావళి
26. అసలు మహాత్ముదు
27. పంచ మహాయజ్ఞ విధి

१. चारों वेदों का हिन्दी भाष्य
२. सत्यार्थ प्रकाश हिन्दी
३. सत्यार्थ प्रकाश अंग्रेजी
४. ऋग्वेदादिभाष्य भूमिका
५. वैशेषिक, सांख्य, न्याय, बेदान्त दर्शन हिन्दी भाष्य स्वामी दर्शनानन्द सरस्वती
६. युग निर्माता सत्यार्थ प्रकाश सन्दर्भ दर्पण
७. Vedic concept of Culture and Civilization
८. असल महात्मुडु स्वामी श्रद्धानन्द-तेलुगु
९. कालजयी सन्त महर्षि दयानन्द सरस्वती
१०. धर्मवीर पं. लेखरामजी का जीवन चरित्र
११. मैने निजाम पर बम क्यों डाला ?
१२. बागी दयानन्द
१३. महर्षि दयानन्द की देन
१४. देवर्षि दयानन्द चरित
१५. बौद्धमत और वैदिक धर्म
१६. संक्षिप्त सत्यार्थ प्रकाश
१७. सत्यार्थ प्रकाश विमर्श
१८. आर्य मान्यताएँ
१९. वैदिक इतिहास विमर्श
२०. आस्तिकवाद
२१. चतुर्वेद शतकम्
२२. प्रार्थना-प्रवचन
२३. अतीत के यश की धरोहर
२४. सत्यार्थ सन्देश
२५. वेदान्त मीमांसा-सन्देश
२६. न्याय-वैशेषिक-सन्देश
२७. ऋग्वेद सन्देश
२८. बंगाल शास्तार्थ
२९. अपने आपको कैसे जानें और पढे
३०. संकल्प-सिद्धि
३१. प्रेरक-प्रसंग
३२. वीरांगना महारानी कैकेयी
३३. वेदों में इतिहास नहीं
३४. देव यज्ञ
३५. योग मार्ग
३६. सत्य सनातन वैदिक धर्म
३७. अभिवादन नमस्ते ही क्यों ?
३८. ज्योतिर्मय
३९. राष्ट्र रक्षा के वैदिक साधन
४०. ब्रह्मा कुमारी संस्था ढोल की पोल
४१. शराब बन्दी क्यों आवश्यक है ?
४२. आर्य समाज परिचय
४३. वैदिक सन्ध्या अग्निहोत्र विधि
४४. हैदराबाद का मुक्ति संग्राम
४५. आदर्श एवं बहुआयामी व्यक्तित्व के धनि लक्ष्मणराव गोजे
४६. पञ्च महायज्ञ विधि-तेलुगु

*(नोट : तांबे के हवन कुण्ड और हवन पात्र बी उपलब्ध हैं)*

# आर्य प्रतिनिधि सभा ने मनाया हैदराबाद मुक्ति दिवस




हैदराबाद, 17 सितंबर-(मिलाप ब्यूरो) आर्य प्रतिनिधि सभा, आंध्र प्रदेश-तेलंगाना के तत्वावधान में आज कोठी चौराहे पर पं. नरेन्द्र की प्रतिमा के पास 68वाँ हैदराबाद मुक्ति दिवस मनाया गया।

संस्था के प्रधान विट्ठल राव आर्य ने कार्यक्रम की अध्यक्षता की। पं. प्रियदत्त शास्त्री के पौरोहित्य में देव यज्ञ से कार्यक्रम का शुभारंभ हुआ। विट्ठल राव के राष्ट्रीय ध्वज फहराने के बाद राष्ट्रीय गीत का सामूहिक गायन हुआ। भाजपा नेता गोविंद राठी ने पं. नरेन्द्र की प्रतिमा पर पुष्पांजलि अर्पित की। इसके बाद अपने संबोधन में राठी ने आर्य समाज के आंदोलन एवं निज़ाम शासन के विरुद्ध किये गये संघर्ष का वर्णन किया। पं. नरेन्द्र के साहसिक कार्यों का उल्लेख करते हुए गोविंद राठी ने उन्हें 'हैदराबाद का सरदार पटेल' कहा। अध्यक्षीय भाषण में विट्ठल राव आर्य ने 17 सितंबर को हैदराबाद मुक्ति दिवस मनाने का औचित्य स्पष्ट किया। उन्होंने कहा कि भारत को 15 अगस्त, 1947 को मिली आज़ादी पूर्ण नहीं थी। एक वर्ष बाद लौह पुरुष सरदार पटेल के साहसिक निर्णय के बाद की गई पुलिस कार्रवाई के फल स्वरूप 17 सितंबर, 1948 को हैदराबाद राज्य निज़ाम के निरंकुश शासन से मुक्त हुआ। यह दिन देश की पूर्ण आज़ादी का दिन रहा। तेलंगाना के लिए यह आज़ादी का दिन है। राज्य सरकार पर इसे सरकारी तौर पर मनाने का उत्तरदायित्व है, किन्तु राजनीतिक स्वार्थ के कारण वर्तमान सरकार इस मुद्दे पर निर्लिप्त व्यवहार कर रही है, जो सर्वथा अनुचित है। विट्ठल राव आर्य ने कहा कि हैदराबाद मुक्ति संग्राम में किये गये आंदोलनों में आर्य समाज की विशेष ऐतिहासिक भूमिका रही है। अनेक आर्य वीरों और नेताओं के त्याग और बलिदान के कारण हैदराबाद राज्य मुक्त हुआ। हैदराबाद मुक्ति दिवस को सरकारी तौर पर नहीं मनाये जाने पर आक्रोश व्यक्त करते हुए उन्होंने कहा कि यह अत्यंत दुर्भाग्यपूर्ण है। उन्होंने भविष्य में इस दिन को सरकारी तौर पर मनाने की पुरज़ोर माँग की। साथ ही कहा कि ऐतिहासिक तथ्यों से भावी पीढ़ी को अनभिज्ञ रखना बड़ा ही घातक है। सभा को उप-प्रधान डॉ. वसुधा शास्त्री, आचार्य अरविंद शास्त्री ने भी संबोधित किया। संचालन उप-मंत्री बी. सत्यनारायण ने किया। कार्यक्रम में आर्य प्रतिनिधि सभा के अधिकारी तथा नगर के अनेक आर्य बंधुओं ने हिस्सा लिया।



# విజయ దశమి ఊరేగింపు

ఆర్య ప్రతినిధి సభ ఆంధ్రప్రదేశ్ / తెలంగాణ
ఆర్య సమాజము కిషన్‌గంజ్ సంయుక్త ఆధ్వర్యమున
జంటనగరాల ఆర్యసమాజముల 89వ

**విజయ దశమి ఊరేగింపు**

శ్రీ దుర్ముఖినామ సంవత్సర ఆశ్వయుజ శు॥ దశమి మంగళవారం
తేది 11-10-2016 సాయంత్రం 4 గం॥లకు

## శ్రీ మామిడి శ్రీనివాస్ గారు

(అధ్యక్షులు, ఆర్యసమాజము, సికింద్రాబాద్)
రథారూఢులై ఊరేగింపునకు నాయకత్వం వహిస్తారు.
ఊరేగింపు ప్రారంభమున ఆర్య సమాజము కిషన్‌గంజ్‌లో అభినందన సభ జరుగుతుంది.

# विजय दशमी की शोभा यात्रा

**आर्य प्रतिनिधि सभा आ.प्र.-तेलंगाना**
एवं
**आर्य समाज किशनगंज, हैदराबाद**
के संयुक्त तत्त्वावधान में नगर द्वय की आर्य समाजों की ऐतिहासिक ८९ वीं विजय दशमी की शोभा यात्रा
श्री दुर्मुखी नाम संवत्सर आश्विन शु. दशमी मंगलवार
दिनांक ११ अक्तूबर २०१६ को सायंकाल ४-०० बजे

## *श्री मामिड़ी श्रीनिवास जी*

(प्रधान आर्य समाज सिकिन्द्राबाद)
रथारुढ़ होकर शोभायात्रा का नेतृत्त्व करेंगे ।
शोभा यात्रा के प्रारंभ में आर्य समाज किशनगंज में अभिनन्दन समारोह होगा ।

# శ్రీ మామిడి శ్రీనివాస్ ఆర్య



జననము : 1932, స్థలము : హసమత్‌పేట్, సికింద్రాబాద్.
తల్లిదండ్రులు : శ్రీమతి వెంకటమ్మ - శ్రీ వీరయ్య గార్లు
విద్యాభ్యాసము : 1952లో మహబూబ్ కాలేజ్ 7వ తరగతి
వివాహము : 1966లో వివాహము జరిగినది.

**ఆర్య సమాజ పరిచయము :** 1955 నుండి బండారరి సత్యనారాయణ, అధ్యక్షులు మరియు బండారి శంకర్ రావు మిత్రుల ద్వారా దక్కన్ మానవ సేవాసమితి చేసిన గోవధ నిషేధ కార్యక్రమములో పాల్గొన్నారు. ఈ సమితికి మూడు సార్లు అధ్యక్షునిగా సేవ చేసారు. విశ్వ హిందూ పరిషత్ ఆధ్వర్యంలో ఛలో అయోధ్య కార్యక్రమములో 1000 మంది కరసేవకులకు నాయకత్వం వహించారు. ఆల్ కబీర్ గోహత్యానిషేధ కార్యక్రమములో పాల్గొని యజ్ఞము చేసి అరెస్టు కూడా అయ్యారు. వీరు ఆర్య సమాజము సికింద్రాబాద్ నుండి 1956-59 వరకు శ్రీమాన్ పండిత వెంకటేశ్వర్ శాస్త్రి గారితో విరాట్ పత్రిక యొక్క కంపోజర్‌గా పనిచేసారు. హస్మత్‌పేట్‌లో శ్రీ ఆంజనేయ యువజన సంఘం కె.వి. రంగారెడ్డి గారి ఆధ్వర్యంలో శ్రీ గణపతి పాండు, చుక్క నర్సింహ్మ గారి సహాయ సహకారాలతో 1955లో స్థాపించి అనేక సేవా కార్యక్రమాలు చేశారు. వాటిలో ముఖ్యమైనవి : హెల్త్ క్యాంపులు, వితంతువులకు జీవనాధారం చూపించుట, కుట్టు శిక్షణా కేంద్రములు నిర్వహించుట, వయోజనులకు వయోజన విద్య నిర్వహించుట, యువకులకు వ్యాయామశాల, కత్తి, కర్ర సాము, కబడ్డి నేర్పించినారు. వీరు హస్మత్‌పేట్ సంక్షేమ సంఘాన్ని స్థాపించి అధ్యక్షునిగా కొనసాగుతూ, దాదాపు 150 మంది పేదలకు ఇంటి స్థలాలు మంజూరు చేయించినారు, ఆర్య సమాజమునకు మంత్రి, కోషాధికారిగా మరియు వివిధ సేవలు చేసి ప్రస్తుతము ఆర్య సమాజము సికింద్రాబాద్ మరియు దీని ఆధ్వర్యంలో నడిచే హిందీ విద్యాలయము మరియు సరస్వతి కన్యా విద్యాలయములకు అధ్యక్షునిగా పనిచేయుచున్నారు.

**ఈయన విద్యారాణి (ఇది కలం పేరు) అని కవితలు కూడారచించారు.**

**కాళోజి నారాయణ రావు, విశ్వనాథ సత్యనారాయణ, దాశరథి, వట్టికోట అల్వార్ స్వామి వీరి ద్వారా సాహిత్య సభలు నిర్వహించారు.**

Date of Publication 2nd & 17th of every Month, Date of posting 3rd and 18th of every month
*आर्य जीवन* 03-10-2016 Registered-Reg. No. HD/783/2015-17 RNI.No.52990/93

To,

ఆర్య జీవన్
హిందీ-తెలుగు ద్విభాషా పక్ష పత్రిక
Editor: **Vithal Rao Arya**, M.Sc. LL.B., Sahityaratna
Arya Prathinidhi Sabha AP-Telangana, Sultan Bazar, Hyderabad-95.
Phone No. 040-24753827, 66758707, Fax: 040-24557946
Annual subscription Rs. 250/- **సంపాదకులు - విఠల్‌రావు ఆర్య, ప్రధాన్ సభ**

Estd.1931



MAHARSHI DAYANAND SARASWATI
Founder of Arya Samaj

Reg. No. 6/52 Fasli (old) 1342/84 (New)

# आर्य प्रतिनिधि सभा आ.प्र. तेलंगाना, हैदराबाद

# ARYA PRATINIDHI SABHA A.P. TELANGANA, HYDERABAD

# ఆర్య ప్రతినిధి సభ ఆ.ప్ర. తెలంగాణ, హైదరాబాద్.

20-09-2016

## सूचना

**सेवा में,**
**श्रीमान प्रधानजी / मंत्रीजी**
**आर्य समाज** --------------------

नमस्ते ।

**मान्यवर महोदय,**

आर्य प्रतिनिधि सभा आ.प्र.-हैदराबाद, तेलंगाना के संभावित चुनाव को दृष्टि में रखकर प्रांत की आर्य समाजों के अधिकारियों से निवेदन है कि अपनी-अपनी समाजों की साधारण सभा को आहूत कर दशाहरा-दीपावली तक समाजों के निर्वाचन सम्पन्न करवालें । साधारण सभा में आर्य प्रतिनिधि सभा के लिए भेजे जाने वाले प्रतिनिधियों का भी निर्वाचन अवश्य कर लें । पहले 9 सभासदों पर एक प्रतिनिधि पश्चात प्रति 20 सभासदों पर (पूर्ण 20 पर) एक-एक प्रतिनिधि का निर्वाचन कर लें । अधिकतम प्रतिनिधियों की संख्या 5 रहेगी । साधारण सभा के साभासदों की सूचि तथा निवार्चन की कार्यवाही को मिनिट बुक में अवश्य अंकित करें । साधारण सभा आहूत करने की सूचना को भी सूचना पुस्तक में अंकित करें । ध्यान रहे कि सभासद को ही मत देने का अधिकार है । निर्वाचन में विलंब न करें । दीपावली तक अवश्य निर्वाचन सम्पन्न करवा लें । समस्यात्मक समाजों में सभा निर्वाचन करवाएगी यथा नार्थ लालागुड़ा, नलगोंडा, महबूबनगर, अशोक बाज़ार आदि ।

सूचनार्थ व आवश्यक कार्यवाही के लिए ।

धन्यवाद ।
**भवदीय**

**हरिकिशन वेदालंकार**
**सभा मंत्री**

**विठ्ठलराव आर्य**
**सभा प्रधान**

THE VIEWS & THE NEWS PUBLISHED IN THIS ISSUE MAY NOT NECESSARILY BE AGREEABLE TO THE EDITOR
*Editor* Vithal Rao Arya ● acharyavithai@gmail.com, Mobile : 09849560691

సంపాదకులు : శ్రీ విఠల్‌రావు ఆర్య, ప్రధాన్, ఆర్యప్రతినిధి సభ ఆ.ప్ర.-తెలంగాణ, సుల్తాన్‌బజార్, హైదరాబాదు-95. Ph: 040-24753827, Email : acharyavithal@gmail.com
संपादकः श्री विट्ठलराव आर्य प्रधान सभा ने सभा की ओर से आकृति प्रेस चिक्कडपल्ली में मुद्रित करवा कर प्रकाशित किया ।
प्रकाशकः आर्य प्रतिनिधि सभा आं.प्र.-तेलंगाना, सुल्तान बाज़ार, हैदराबाद तेलंगाना-95.